# గరుడ పంచమి వ్రత కథ

పూర్వం ఒకానొక గ్రామంలో పెద్ద జమీందారు ఉండే వారు. అతనికి ఏడుగురు కొడుకులు ఒక కుమార్తె. ఆమె పేరు అన్నలక్కమ్మ అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచు కుంటు ఉంటారు ఆమె పెరిగి పెద్దది ఐ మంచి రూపవంతు రాలై వివాహమునకు యుక్త వయస్సు రాలైనది . తండ్రి అదే గ్రామంలో ఒక మంచి భూస్వామి కొడుకుకు ఇచ్చి వివాహం చేసిన వాడైనాడు .కొంతకాలనికి తన ఏడుగురు కుమారులకు మం చి సంభందములూ చూశి వివాహం చేసిన వాడైనాడు.కొంత కాలమైన తర్వాత శ్రావణ మాస నాగుల చవితి పండుగ ముందర తమ ముద్దుల చెల్లెలు ఐన అన్నలక్కమ్మను పండుగకు పిలుచుకొని రావటానికి బావ గారింటికి వెళ్ళి బావగారిని మామగారిని పోడుగకు పంపమని వేడుకొనినారు. అప్పుడు వారి బావ గారు పండగ రోజు మాత్రమే వచ్చునని తమకు పండుగ ఉన్నాదణి తెల్పినారు . అన్నలక్కమ్మ వారి అన్న గార్లతో పుట్టింటి వారు శ్రేయస్సు కొరకై “గరుడ పంచమి” నోములు నోచుట మంచిదని వదిన గార్లకు తెల్పమని అలాగే  నాగుల చవితి ముందు రంధ్రాలు పూడ్చటము సున్నాలు వేయడం చేయరాదని అలా చేస్తే నాగదోషం ఆపాదించబడు తుందని వదిన గార్లకు  తెల్పండి అని చెబుతుంది  .అలాగే నాగుల చవితి రోజు అన్నగార్లను పొలాలకు పోవద్దని  తెల్పుతుంది . ఈమె చెప్పిన మాటలను అన్న గారు లెక్కచేయక నాగుల చవితి రోజున పొలానికి  వెళ్ళి వారు నాగలి తో పొలం దున్నుతూ ఉన్న సమయంలో పొలం ప్రక్కన ఉన్న ఒక పెద్ద పుట్టకు నాగలి మొన తగిలి పుట్ట పగిలి పోయి అందులో ఉన్న దేవతా సర్పం పోలంప్రక్కనే ఉన్న వీరి ఇంటి గావాక్షం లోనుంచి లోనికి ప్రవేశిస్తుంది .ఐతే ఇల్లంతా రంధ్రాలు లేకపోవడం వలన వారి ఇంటిలో ఉన్న పెద్ద రోటిలో చుట్ట చుట్టుకొని పడుకొని ఉంటుంది .ఆ విషయంను గ్రహించని అక్కాచెల్లెలు చేటల నిండా నూగులు బెల్లం తెచ్చి రోట్లో వేసి దంచుతారు.దేవతా సర్పం కావున అది వీరికి కానపడదు.ఆ విదంగా దంచడం వలన ఆ సర్పం చనిపోయి ఆ ప్రసాదం విషతుల్య మవుతుంది.విషపూరిత మైన ఆ ప్రసాదాన్ని అన్నవోదినలు భుజించి అక్కడికక్కడే మరణించడం జరుగుతుంది.అన్నలక్కమ్మ తమ ఇంటిదగ్గర అందరకు భోజనం పెట్టి తమ అన్న వొదిన గార్ల దగ్గరకు రాగ అక్కడ విగత జీవులై పడివుండడాన్ని గ్రహించి చింతిస్తూ గౌరీ దేవిణి  గురించి ప్రార్థించగా ఆమె ఆవేదనను గ్రహించి ఆకాశ వాణి ద్వారా గౌరీ దేవి వారి అన్నగార్లు చేసిన తప్పులను తెల్పి అక్షతలు తీసుకెళ్ళి విగతజీవులై ఉన్న వారి మీద చల్లమని అలా చేస్తే వారు పునరుజ్జీవులు అవుతారు అని తెల్పుతుంది. వెంటనే ఆమె తన ఇంటికి పోయి తను చేసిన వ్రతం దగ్గర ఉన్న అక్షతలు తీసుకొని వచ్చి విగతజీవులై ఉన్న వారి మీద చల్లగా వారు తిరిగి పునరుజ్జీవులు అవుతారు. ఆ తర్వాత మరల అందరు కలిసి ప్రసాదం తయారు చేసుకొని  గరుడ పంచమి నోమును నోచుకోని అమ్మవారి కృపకు పాత్రులైనారు.ప్రతి సంవత్సరం ఈ వ్రతాన్ని ఆచరిస్తూ అనంతమైన సంపదలను పొంది సుఖ సంతోషాలతో జీవనం సాగించి చివరకు శివ సయిజ్యం పొందినారు. అప్పటి నుండి ఈ వ్రతాన్ని పుట్టింటి వారి క్షేమాన్నికోరి స్త్రీలు ఈ వ్రతాన్ని ఆచరిస్తూ సుఖసంతోషాలతో జీవనం సాగించసాగారు. అప్పటి నుండి  ఈ పండుగకు అన్నచెల్లెళ్ళ పండుగ అని కూడా పేరు వచ్చినది.అప్పటి నుండి ప్రతి ఒక్కరు తమ తమ పుట్టింటి వారి క్షేమం కోరి ఈ వ్రతం చేయసాగారు. ఈ కథ విన్న వారికి చదివిన వారికి శుభములు జరుగుతుంది అని పెద్దల ఉవాచ.